గాక కాలము, ప్రదేశము, పరిస్థితులు, పరిసరములయొక్క సామరస్యత ననుసరించి బాహ్యోన్ముఖ శక్తులయొక్క అవరోహణా గ్రహణముకూడ నయి యున్నది. ఈ బాహ్యోన్ముఖశక్తి అహములను, ఇంద్రియములను ప్రోద్బలపరచి, సహజ వివేకముతో సామరస్యముగల భావోన్ముఖతలకు వ్యతిరేకముగా వర్తింప జేయుటయేగాక పూర్వ జన్మ గతములయిన మానవేతర ప్రవర్తన, వ్యవహారాదుల కనుకూలముగ నుండును.

ఈ పరిస్థితులయందు, మానవులు వివిధ వ్యక్తులచే వినిర్గతమై, విస్తృతమైన బాహ్యోన్ముఖ శక్తులను గ్రహించి, బాహ్యాభివృద్ధిని పొంది, ప్రళయమును దుఃఖమయముగ జేయుదురు. వారు అవిశ్వాత్మక భావవ్యాప్తికి, మానవులలోని విభాజన, విభిన్నత. అశాంతి, కల్లోలములపై నాధారపడి, విశ్వమానవ నిర్మాణ తత్వమునకు వ్యతిరేక సాధనము లగుదురు. అందువలన మానవులవిపర్యయముగ భావించి, ఆలోచించి, జీవవస్తు విషయాదులతోడి వ్యవహారములలో, అనాధ్యాత్మికత్వ ప్రకోపమునకు సాధనములు కాకుందురుగాక !

పునర్జన్మావశ్యకత కతీతులయిన తరువాత, అనగా సశరీర స్థితియందు సంతృప్తిని సాధించిన తరువాత సూక్ష్మ, అతిసూక్ష్మేంద్రియముల సక్రమ వ్యవహారమువలన, సశరీర అశరీరావస్థలయందు, మానవులు విశ్వమందు (ప్రపంచమునందు కాకపోయినప్పటికినీ) అశరీరులై, విశ్వావశ్యకత ననుసరించి వ్యవహరించుచున్నారు. ఈ స్థితియందు వారికి శరీరములు, స్థూల సృజనేంద్రియములు లేవు. వారు అభ్యుదయోన్ముఖాహములు సహజ వివేకము, సూక్ష్మ, అతిసూక్ష్మేంద్రియములు, ఆధ్యాత్మి కేంద్రియములు కలిగియుందురు. వారు సహజ వివేకపు టుపయోగమున కతీతులైనప్పటికినీ, వారు విశ్వ

జీవింలో నేకత్వము పొందువరకును అది వారిలో నొక భాగముగ నుండి పోవును.

ఇక్కడ వారికి, ఒకదాని కొకటి సహాయకారులుగ నాలుగు తరగతుల ఆశయములు వ్యవహారములు నున్నవి. వానిలో మొదటి స్థితియం దున్నవారు సక్రమమగు సూక్ష్మేంద్రియ వ్యవహారము కలిగి, కొంచె మించుమించు సక్రమ వ్యవహారము గల అతి సూక్ష్మేంద్రియములు, అభ్యుదయ పథమునందున్న అహములు గలిగియుందురు. ప్రదేశమునందు విస్తృతమగుచున్న శక్తులను సమీకరించి మానవేతర జీవులకు మానవత్వార్హతను కలుగ జేయుటయే వారికి గల యాశయము, బాధ్యత. రెండవ దశయందలి వారు సక్రమ వ్యవహారము గల అతి సూక్ష్మేంద్రియములు, కొంచె మించుమించు సక్రమ వ్యవహారములు గల అత్యధిక సూక్ష్మేంద్రియములును అభ్యుదయ పథమునందు గల యహములను కలిగియుందురు. విశ్వ నిర్మాణమునందు భౌతిక సామరస్యమును కలిగించి, ఆ యా భూతములు, ప్రదేశముతో సామరస్యము కలిగి యుండునట్లు చేయుటయే వారికిగల యాశయము, బాధ్యతలు. మూడవదశ యందలి వారు సక్రమ వ్యవహారముగల అత్యధిక సూక్ష్మేంద్రియములను కొంచె మించుమించు సక్రమ వ్యవహారము గల మహా సూక్ష్మేంద్రియములను, అభ్యుదయ పథమునందు గల అహములను కలిగియుందురు. భౌతిక సామరస్యమును, సాధారణ విశ్వ నిర్మాణ స్థితి కనువగునట్లు, విశ్వసిద్ధాంతాను సారము కలుగు మార్పులను భరించునట్లు చేయుటయే వారి యాశయము, బాధ్యత. నాలుగవ దశయందున్న వారు సక్రమ వ్యవహారముగల మహా సూక్ష్మేంద్రియములను, యించుమించు సక్రమ వర్తనము గల ఆధ్యాత్మి కేంద్రియములను కలిగి యుందురు. ఈ స్థితియందు వారు సహజ వివేకేంద్రియములను వ్యక్తిత్వమును గోల్పోయి జీవులతో లీన

మగుగుదు. విశ్వవ్యక్తి యహములు వారిలోని విశ్వ యహముతో లీన మగును. ఇచ్చట జీవులకు విశ్వత్వమే (Universality) గాని, వ్యక్తిత్వము (Individuality) లేదు. సర్వాంతర్యామి స్వరూపమయిన విశ్వజీవియొక్క వ్యక్తీకృత స్థితి కిది కిరీటము. భూతములకు, పదార్థములకు మూలమయిన పదార్థ మూలము నుచితస్థితియం దుంచుటయే విశ్వత్వము పొందెడివరకును వారికి గల యాశయము బాధ్యత. ఈ నాలుగు దశల తరువాత జీవులు తమ మూలము, నాధారమయిన విశ్వజీవితో నేకత్వము పొందెదరు. ఇదియే వ్యక్తీకృతమయిన విశ్వజీవియొక్క పునః విశ్వీకరణము.

ఈ యేకత్వస్థితివలన, జీవులు తమ వ్యక్తిత్వమును గోల్పోయి అవినాభావముగ, తమకు మూలము, ఆధారమునయిన విశ్వజీవి యగుదురు. వ్యక్తి అహములు విశ్వ అహముతో లీనమగును. సూక్ష్మాది యింద్రియములు విశ్వజీవి యింద్రియములతో లీనమయి, ఆ యాశక్తులు ప్రదేశమునందలి తమ మూలములలో జేరిపోవును.

కొందరు వ్యక్తులు, అశరీర స్థితియందు, సూక్ష్మేంద్రియ సక్రమ వ్యవహారస్థితికిని, అతి సూక్ష్మాది యింద్రియముల సక్రమ వ్యవహార స్థితికిని మధ్య, విశ్వనిర్మాణ సామరస్యమునకు బాధ్యులగుటవలన, అనివార్యముగ, పునరవతరణ గావించవలసిన పరిస్థితుల వలన సశరీరులయి మరల యవతరించుచున్నారు. ఈ యవతరణలు ప్రపంచమందలి వేర్వేరు ప్రాంతములలో మానవుల వ్యవహారాదులవలన కలిగిన విశ్వనిర్మాణ అసామరస్యతలను సరిదిద్దుటకు విశ్వావశ్యకత ననుసరించి జరుగుచుండును.

ప్రేమ జ్ఞాన సామర్థ్యముల అసామాన్యపు టభివృద్ధుల వలన నేర్పడిన అసామరస్యతను సరిదిద్దుటకు వారు ప్రేమ జ్ఞాన సామర్థ్య

ముల మూడింటిలో ఏ యొకటి రెండింటి యొక్కయో, లేక మూడింటి యొక్కయో పరిపూర్ణత్వముతో నవతరించి ఆ యా ప్రాంతముల పరిస్థితుల కనువగునట్లు ప్రవర్తన, వైఖరి, అలవాట్లును కలిగి విశ్వ సామరస్య పునస్థాపనకొరకై వ్యవహరింతురు.

అట్టివారి సశరీర స్థితి యనంతరము, వారి శరీరములు గతించిన తరువాత అశరీర స్థితియందు అభ్యుదయ పథమున వారే స్థితినుండి అవతరించిరో ఆ స్థితికి జేరెదరు. వారి ఆశయములు, బాధ్యతలు అశరీర స్థితియందును సమానమే. వారు అభ్యుదయ పథమున పురోగమించుచు, ఇతరుల అభ్యుదయ పురోగమనమునకు సహాయ కారులగుచు తమ కర్తవ్యమును నిర్వహించుచున్నారు. వారక్కడ యుండియు, నక్కడనున్నారు. ఇక్కడ యుండియు నక్కడ యున్నారు. వారితరుల భావనల కతీతులగుటవలన, ఇక్కడను ఉన్నారు, అక్కడను కూడ నున్నారు. అన్ని చోటులయందున్నారు. సర్వమునందున్నారు. సర్వాంతర్యామిలో నున్నారు.

వారీ ప్రపంచమునందు సశరీరులై యున్నప్పుడు అహము, సహజ వివేకములే గాక స్థూల, సృజనేంద్రియములనుండి ఆధ్యాత్మికము వరకుగల సమస్తేంద్రియములను కలిగియున్నారు. వారి స్వభావోన్ముఖతలు, బాధ్యతలు ఆశయములతో సామరస్యము కలిగి యుండును. జీవనస్తు విషయాదులతోడి వ్యవహారములలో, వారి ప్రవర్తన వైఖరులు విశ్వసిద్ధాంతములతో, కర్తవ్యముతో సామరస్యము కలిగి యుండును. వారెల్లప్పుడును సుఖదుఃఖముల యొక్కయు, కీర్తి అపనిందల యొక్కయు, శీతోష్ణముల యొక్కయు ప్రాబల్యమున కతీతులుగ నుందురు. ఈ పై వాని ప్రాబల్యము శరీరముపైనను, స్థూల సృజనేంద్రియములపైనను యగుటవలనను, వారి శరీరధారణ, స్వయం

కృతమగు ఆవశ్యకతనుబట్టి గాక, విశ్వావశ్యకత ననుసరించి యగుట వలననూ, వారి సూక్ష్మేంద్రియములు స్థూల సృజనేంద్రియములకు శరీరములకు అతీతములై వ్యవహరించెడి సామర్థ్యము కలిగి యుండిన నగుటవలనను, వారి యహములకు బాధ్యతలు, ఆశయములు, నిర్వహణ సిద్ధాంతములతో సామరస్యము సుస్థిరమయి యుండుటవలనను, వారు స్థూల సృజనేంద్రియముల యొక్కయు, శరీరము యొక్కయు ప్రాబల్యమునకు సర్వదా అతీతు లగుదురు.

ఈ పరిస్థితులయందు, ఈ ప్రపంచమునందు వారు సశరీరులై యున్నపుడు సూక్ష్మమునుండి, అతిసూక్ష్మమువరకు వారి యింద్రియములు తీక్ష్ణమై నిర్మలముగను, స్వచ్ఛముగను యుండును. ఈ స్థితి వలన వారు వస్తు విషయాదులను, జీవులను, వానియందు కూడ సక్రమముగ నవలోకింప గలరు. జీవవస్తు విషయాదులను గూర్చి సక్రమముగ ననుభవించి మానవులచే సాధింపబడవలసిన మార్పులను ప్రకటించి విశ్వ నిర్మాణమునందు సామరస్యము నెలకొల్పి, అనివార్య భావి పరిస్థితులను ప్రకటించి పరిస్థితులకు లొంగకుండ వ్యవహరింతురు. వారు అపాయములకు గురికారు. వారికి అపాయములే లేవు.

నిప్పటి ఫలితములు, నేటి సంఘటనలు, భూతము, భవిష్యత్తు సదా, విశ్వమంతు యీనాడే యుండుటవలన అవివర్తమానములోనే సూక్ష్మ, అతిసూక్ష్మ, అత్యధిక సూక్ష్మ, మహాసూక్ష్మ రూపములలో నుండుటవలన, వారిసూక్ష్మ, అతిసూక్ష్మాదింద్రియములు తీక్ష్ణము. స్వచ్ఛము నిర్మలము నగుటవలన, ఆ ఫలితములు, సంఘటనలు వారి యింద్రియములకు గోచరము లగును. సశరీరులై యున్న ఆ యాధ్యాత్మిక మహావ్యక్తులు వారి విశ్వబాధ్యతా నిర్వహణమునకు, వారి విశ్వ కర్తవ్య సంసిద్ధికొరకు, అభిశాప్య పరిస్థితులను నిర్మూలించి

ప్రళయకాలమందు విశ్రాంతిమయ పరిస్థితుల నేర్పఱచుటకు గంభీరముగ, సవినయముగ, అనైక్యత, కల్లోలము, దారిద్ర్యము, బాహ్యాభివృద్ధు లను పోగొట్టి సమైక్యత, శాంతి, సంపద, అభ్యుదయములను నెల కొల్పి, తమనుగూర్చి, విశ్వమునుగూర్చి, తమ మూలము ఆధారము వీనికి గల పరస్పర సంబంధమునుగూర్చి, మానవుల భావములు, విశ్వా సములు, మార్పులు పొందుటకుగాను తా మవలోకించిన వానిని ప్రపంచమునకు ప్రకటింతురు. విశ్వావశ్యకతా సాధనవలన విశ్వాభి శాప్య నివారణ విశ్వమందలి సమస్త మానవుల బాధ్యత యగుటవలన మహోన్నత పరిమాణము గల కార్యమగుటవలన, విశ్వమంత సము న్నతమైన దగుటవలన ప్రపంచమునందలి మానవులందరును ఆధ్యా త్మిక మహావ్యక్తి సూచనలను, స్ఫురణలను గమనించి విశ్వమానవ కర్తవ్యమును మానవోచితముగ విశ్వాత్మకముగ నిర్వహింతురు గాక.

అందువలన,

సర్వాంతర్యామి యీ సందేశమును ప్రపంచమందలి సమస్త
మానవుల ప్రార్థనగ ఆమోదించుగాక !

అజ్ఞాతము, జ్ఞాతమునయిన ఆధ్యాత్మిక మహావ్యక్తుల కందరకును

మంగళము, జయము.

---